అద్వైత మనేది అద్భుతమైన,
అఖండమైన అద్వయ
ఆనందానుభూతి.
ఇది ఆకారమూ కాదు.
మతమూ కాదు. అద్వైతము సత్యము.
రెండు కానిది, రెండు లేనిది
అద్వైతము.
అద్వైతామృతమును
వేదాంతశాస్త్రము సమృద్ధిగా
అందించింది. పరమ పవిత్రమైన
అద్వైత మధను భాష్యాలలోనే గాక
స్తోత్రాలు, ప్రకరణ గ్రంథాలనే
పాత్రలలో నింపి, విరివిగా
వితరణ చేశారు
శ్రీ ఆదిశంకరులు.వేదాంత శాస్త్రానికి
విశ్వఖ్యాతిని తెచ్చిపెట్టారు.
శంకర వాఙ్మయాన్ని తమ అసమాన
సులలిత వ్యాఖ్యలతో సులభతరం
చేసి, అద్వైత పీయూషాన్ని
ముముక్షువులచే కడుపారా త్రావించే
కార్యాన్ని చేపట్టి
కృతకృత్యు లయ్యారు శ్రీ స్వామి
సుందర చైతన్యానందుల వారు.
శంకరుల వారి గ్రంథాలకు
స్వామీజీ అందించిన భాష్యాలను
"శంకర చైతన్యం" అనే నామంతో
అనేక సంపుటాలుగా అందించాలని
సంకల్పించడం జరిగింది.
మోక్షమార్గాన ముముక్షువులకు
"శంకర చైతన్యం" కరదీపిక
కాగలదని విశ్వసిస్తున్నాము.




# శంకర చైతన్యం-1

## శివాపరాధ క్షమాపణ స్తోత్రం
## సువర్ణమాలా స్తుతి



స్వామి సుందర చైతన్యానంద



# శివాపరాధ క్షమాపణ స్తోత్రము



# శివాపరాధ క్షమాపణ స్తోత్రం

## అవతారిక

### కరుణించు ప్రభూ !



భగవంతుడు ప్రపంచాన్ని సృష్టించాడు. పరితాపాన్ని సృష్టించలేదు. బ్రతుకు నిచ్చాడే కాని బాధలను ఇవ్వలేదు. బాధలను మనిషి సృష్టించు కున్నాడు. బరువులను తయారు చేసుకొని ప్రశస్తమైన మానవజన్మను శోక మయం చేసుకున్నాడు. ప్రపంచం సత్యమని భ్రమించి, నిత్యుడైన పరమాత్మను మరచి, దోషాలకు నిలయమై తోషాలకు దూరు డయ్యాడు.

ఈ ప్రపంచం గిజిగాని గూడు లాంటిది. గింజుకుంటూ, గుంజుకుంటూ ఎంతకాలమీ గుంజాటన? గిజగిజలాడుతూ గిలగిల తన్నుకుంటూ ఎవరి కొరకీ ప్రతిఘటన? అస్తమించడానికే సూర్యుడు ఉదయిస్తున్నాడు. క్షీణించడానికే చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. ఆగిపోవడానికే ఆలాపాన కదులుతున్నది? మూగబోవుటకే మాట పలికింది. ఆలోచించు.

వేటగాడి సంగీతానికి మైమరచిన లేడి బ్రతుకులో ఓడిపోయింది. గాలంలో దాగిన ఇంద్రజాలం అర్థంగాక చేప చచ్చిపోయింది. రూపలావణ్యం చూసి దీపం చెంతకు పరుగుపెట్టే మిడుత శవంగా మిగిలిపోయింది. బ్రతుకు గారడిలో మోసపోయిన జీవి వల్లకాటికి కదిలిపోతున్నాడు.

తామరాకుపై నీటిబొట్లు నిలుస్తాయి. ప్రకాశిస్తాయి. పరవశిస్తాయి. ఆణి ముత్యాల్లా గోచరిస్తాయి. గాలి వీస్తుంది. పత్రం చలిస్తుంది. మురిసే బిందువులు ఒరిగిపోతాయి. నీటిలో రాలిపోతాయి.

బ్రతుకులోని సంపదలన్నీ నీటి బిందువులే అని మరువకు. కాలపవనాలు వీచగానే కనుమరుగవుతాయని తెలుసుకో. అసత్యవస్తువు ఎప్పుడూ నీకు అండ కాదు. లేనిది లేమిని లేకుండా చేయలేదు.

పగిలేది కుండ......

వాడేది దండ........

పగలకుండా కుండను ఆపగలవా?

వాడకుండా దండను నిలుపగలవా?

చెండులా దొర్లిపోకు.

కొండలా నిలిచి చూడు.

మట్టికుండపై మోహమెందుకు? మలినదేహంపై మమత లెందుకు?

పక్షికి చల్లిన నూకలు గోచరిస్తాయే కాని పన్నిన వల తెలిసిరాదు. క్షణికమైన విషయానందానికి జీవుడు ఆకర్షింపబడుతాడే గాని దానిని అంటి ఉన్న అనంత దుఃఖాన్ని చూడలేడు. వలలో చిక్కిన తర్వాత ఎంత గుంజుకున్నా పక్షి విడుదల కాలేదు. సంసారమనే వలలో చిక్కిన జీవి పరిస్థితి కూడా అంతే.

ఈ సత్యం గ్రహించిన వ్యక్తి పశ్చాత్తాపంతో కుమిలిపోక తప్పదు. పొరపాట్లు అదృశ్యం కావాలంటే పశ్చాత్తాపం కదలాలి. అదే ప్రాయశ్చిత్త మవుతుంది. నిష్కృతిని అందిస్తుంది. పరిష్కృతిని ముందుంచుతుంది. పశ్చాత్తాపంతో కూడిన ప్రార్థనలే పరమాత్మ పవిత్రపాదాలను చేరుతాయి. స్పందన లేని ప్రార్థనలు ప్రతి స్పందనను ఎలా దర్శిస్తాయి? ఆర్తి లేని భక్తి ఆర్తనాదాన్ని ఆదిదేవుడు ఆల కించడు.

చేతకాలేదని చింతించకు. చేయూత నిమ్మని పరమాత్మను ప్రార్థించు. చేయూతనిచ్చి రక్షించే చిద్విలాసుని ఎలా పిలవాలి? ఎలా పిలిస్తే మన పలుకులు ఆ దివ్యాత్మకు వినపడుతాయి? ఈ రహస్యాన్ని "శివాపరాధ క్షమాపణ స్తోత్రం" లో శ్రీశంకరభగవత్పాదాచార్యులు సుస్పష్టం చేశారు.

ఈ స్తోత్రం భక్తివైరాగ్యాలను కలిగించే చక్కని స్తోత్రం. ఇది మనస్సును మెత్తబరుస్తుంది. హృదయాన్ని చల్లబరుస్తుంది. బుద్ధికి స్ఫూర్తినిస్తుంది. బ్రతుకుకు దీప్తినిస్తుంది.



మోక్షప్రియా! పరమాత్మ కొరకు పరితపించే వారు ధన్యజీవులు. వేదవలకు స్వస్తి చెప్పు. బ్రతుకునే నివేదనగా మార్చుకో.

బలహీనతలను ప్రక్కకు నెట్టేయి. పరవశించి భగవన్నామాన్ని గానం చేయి. ఆ పారవశ్యంలో పల్లవి కదలనీ! ఆ పల్లవికి స్పందించిన సదాశివుని మంగళ చరణాలు ఆశీర్వాద పల్లకీలో కదలి ముందుకు రానీ, ప్రేమవల్లరి జాలువారి హృదిలో అల్లరి చేస్తూ దివ్యోన్మాదం కలిగించే కమలనేత్రుడితో ప్రయాణం సాగించు. అది ఆద్యంతాలెరుగని ప్రయాణం. అలసట తెలియని యానం. కదలిక అర్థంకాని గమనం. అది ప్రశాంత వసంత యామిని. ప్రేమవెన్నెల సోమధారగా వర్షించే పున్నమి. పురాకృత పునాదులు కదలిపోగా పురాతన వైభవంతో సనాతన అంబారీలో ఊరేగే నిత్యానంద వాహిని.

నేటి వరకు అపరాధాలే అందల మెక్కాయి. ఇకపై క్షమాపణలు కదుల్తాయి.



**ఆదౌ కర్మ ప్రసంగాత్కలయతి**
**కలుషం మాతృ కుక్షౌ స్థితం మాం**
**విణ్మూత్రామేధ్య మధ్యే క్వథయతి**
**నితరాం జాఠరో జాతవేదాః**
**యద్యద్వై తత్ర దుఃఖం వ్యథయతి**
**నితరాం శక్యతే కేన వక్తుం**
**క్షన్తవ్యో మేఽపరాధ శ్శివ! శివ!**
**శివ! భోః శ్రీ మహాదేవ శంభో!** 1

*హే శంభో! ఆదిలో కర్మసంచితం వలన తల్లి గర్భంలో మలమూత్రాలమధ్య పడి ఉన్న నన్ను తల్లి కుక్షిలోని అగ్ని తీవ్రంగా ఉడికించింది. అక్కడ ఏవిధమైన దుఃఖంతో నేను వ్యథ చెందానో తెలియడం ఎవరికి శక్యం? హే శివా! శివా! శంభో! మహాదేవా! నన్ను క్షమించు.*

చేయకూడని పనులు చేసినందుకు, చేయవలసిన పనులు చేయనందుకు ప్రతిఫలంగా కర్మానుభవం పొందడానికి జీవి తల్లి గర్భంలో ప్రవేశిస్తుంది. మలమూత్రాల

మధ్య గర్భస్థ శిశువుగా ఎన్నో బాధలను అనుభవిస్తుంది. మలమూత్రాలతో నిండిన ఆ గుంటలో క్రిములు కూడా వసిస్తూ ఉంటాయి. ఆ క్రిములు శిశువు సున్నిత దేహాన్ని కుడుతూ ఉంటాయి. బాధ అధికమైనపుడు గర్భంలోని బిడ్డ మూర్ఛిల్లుతూ ఉంటుంది.

తల్లి తీసుకునే ఆహారం ప్రభావం వలన కలిగే శీతోష్ణాలను భరిస్తూ జఠరాగ్ని వలన క్రుంగిపోతూ, కుమిలిపోతూ నిస్సహాయ స్థితిలో తొమ్మిది మాసాలు భరింపలేని బాధలను అనుభవిస్తుంది. తల్లి భుజించిన ఆహారంలోని లవణం, కారం, వగరు, పులుపు బిడ్డను తీవ్రబాధకు గురిచేస్తాయి. చల్లని పదార్థాలను గ్రహించినప్పుడు గర్భంలోని జీవుడు ముడుచుకుంటాడు. తీవ్రమైన ఉష్ణపదార్థాలను స్వీకరించే సమయంలో కుమిలిపోతాడు. తల్లి గర్భంలో తలక్రిందుగ పడిఉండి తల్లడిల్లుతాడు.

***"అకల్య స్వాంగ చేష్టాయాం శకుంత ఇవ పంజరే"***

"అవయవాలను కదిలించలేనివాడై పంజరంలో బంధింపబడిన పక్షివలె పడి ఉంటాడు" అని వేదవ్యాసమహర్షి భాగవతంలో ప్రవచించాడు.

గర్భవాసం దుర్భరం. దుఃఖకరం. గత జన్మలలో అన్యులకోసం పాపాలు చేసి నేడు ఒంటరిగా గర్భవాసదుఃఖాన్ని అనుభవించవలసి వచ్చింది అని శిశువు దుఃఖిస్తాడు. క్రమం లేకుండా తల్లి అవయవాలు చలిస్తుంటే సక్రమంగా తల్లి గర్భంలో ఉండలేక జీవి పడిన యాతన యోచనకు అందదు. తల్లి ఆనందంతో గంతులేసినప్పుడు కొండపై నుండి క్రిందపడ్డట్లు ఉంటుంది. అట్టి దుర్భరపరిస్థితిలో జీవి గర్భవాసం అనుభవిస్తూ భగవంతుని ప్రార్థిస్తుంది.

"దేవా! భక్తవత్సలా! తండ్రీ! చేసిన పాపాలకు ప్రతిఫలంగా ఇలా మలమూత్రాలలో దొర్లుతున్నాను. జఠరాగ్నిజ్వాలచే దహింపబడుతున్నాను. దుర్గంధపూరితమైన ఈ మలినకూపం నుంచి బయటపడడానికి మాసాలను, రోజులను లెక్కిస్తున్నాను. ఈ బాధలను గతంలో ఎన్నోసార్లు అనుభవించాను. ఎన్నిసార్లు పుట్టానో? ఎన్నిసార్లు మరణించానో? పాపానికి నిచ్చెనలు వేశానే గాని పుణ్యానికి సోపానాలు నిర్మించుకోలేక పోయాను. సత్యదర్శనానికి ప్రయత్నాలు చేయలేకపోయాను.

***యోని బన్ధాత్ప్రముచ్యేఽయం యది తప్స్యే మహత్తపః***

"ఈ యోనిబంధాన్ని తెంచుకుని బయటపడితే గొప్ప తపస్సును ఆచరిస్తాను."



"హే భగవాన్! పరమేశ్వరా! నీవు దయాసాగరుడవు. ఈ భయంకరమైన దుఃఖం నుంచి నన్ను విడిపించు. తల్లిగర్భం నుండి విశ్వగర్భం లోనికి నన్ను నడిపించు. గతంలో చేసిన పాపాలను పోగొట్టుకుంటాను. సదా నిన్ను భజిస్తాను. భవరోగాన్ని అంతం చేసి, భవ్యరూపుడనై శోభిస్తాను.

చ॥ ***వరగుచు నున్న దుర్వ్యసన భాజనమై ఘన దుఃఖ మూలమై***
***యరయగ బెక్కుతూంట్లు గలదై క్రిమి సంభవమైన యట్టి దు***
***స్తర బహు గర్భ వాసముల సంగతి మాన్పుటకై భజించెదన్***
***సరసిజనాభ! భూరి భవ సాగర తారణ పాద పద్మముల్!***

అని గర్భస్థజీవుని పశ్చాత్తాపంతో కూడిన ప్రార్థనను పోతనామాత్యుడు వివరించాడు.

జీవుడికి ఈ బాధలు ఎందుకు ప్రాప్తించాయి? ఈ దుఃఖాలు ఎందుకు సంప్రాప్తించాయి? పరమశివుని మరచుట వల్లనే కదా! పరమాత్మకు అపరాధం చేయడం వల్లనే కదా! అందుకే ఈ క్షమాపణ. బ్రతుకును కడతేర్చమని అశ్రుపూరిత నయనాలతో విన్నవించే ప్రార్థన.

**బాల్యే దుఃఖాతిరేకా న్మల లులితవపుః**
**స్తన్య పానే పిపాసుః**
**నో శక్తి శ్చేంద్రియేభ్యో భవ**
**మల జనితా జంతవో మాం తుదంతి**
**నానా రోగాది దుఃఖా దుదిత పరవశ**
**శ్శంకరం న స్మరామి**
**క్షంతవ్యో మేఽపరాధ శ్శివ! శివ!**
**శివ! భోః శ్రీ మహాదేవ శంభో!** 2



హే శంభో! బాల్యంలో దుఃఖాతిశయంతో మలమూత్రాదులలో దొర్లుతూ ఇంద్రియాలను కదిలించడానికి అసమర్థుడనై ఉన్నాను. తల్లి పాలు తాగడానికి తల్లడిల్లుతున్నాను. మలం నుంచి జనించిన క్రిములు నన్ను అనేక విధాల బాధించాయి. నానారోగాలతో అపరిమితమైన

దుఃఖం అనుభవించాను. అట్టి సమయాలలోకూడా నిన్ను స్మరించడం లేదు. *హే శివా! శివా! శంభో! మహాదేవా!* నన్ను క్షమించు.

భగవంతుని మరవడం అనే అపరాధం చేసిన దానికి ప్రతిఫలంగా జీవుడు తొమ్మిది మాసాలు తల్లి గర్భంలో నరకయాతన అనుభవిస్తూ గడపవలసి వచ్చింది. ప్రసవసమయంలో ప్రసూతి వాయువులతో భయంకరంగా నెట్టబడి కెవ్వుమని కేకవేసి భూమిపై పడడం జరిగింది.

పుట్టిన తరువాత పొంగివచ్చే మూత్రాన్ని, దూకివచ్చే మలాన్ని ఆపుకోలేక పడకనే పాకీదొడ్డిగా మార్చుకుని, దుర్గంధం అనుభవిస్తూ పొర్లడం జరిగింది. మురికి బట్టలను సరిగా శుభ్రం చేయని దోషం వలన మలం నుంచి పుట్టిన క్రిములు బిడ్డతో కలిసి పడకలో వసించేవి. ఆ క్రిములు బిడ్డను కుడుతూ ఉంటాయి. ఆ బాధను భరించలేక బిడ్డ విలపిస్తూ ఉంటే, ఏడుపుకు కారణం ఆకలేమోనని తల్లి భ్రమించి పాలు పట్టించే ప్రయత్నం చేస్తుంది. అప్పటికీ దుఃఖం ఆగదు. నిద్ర ముంచుకొస్తున్నదేమో నని భావించి బిడ్డను ఊయలలో వేసి ఊపుతుంది.

"అమ్మా! నన్ను చీమలు కుడుతున్నాయి. పురుగులు కరుస్తున్నాయి!" అని చెప్పలేక, నోరు విప్పలేక బిడ్డ అనుభవించిన యాతన యమునికే తెలియాలి. బాలారిష్టదోషాలు ఒకవైపు, దేహ సంబంధమైన వ్యాధులు మరొకవైపు క్రుంగదీస్తుండగా బిడ్డ చెప్పలేని వ్యథను అనుభవించడం జరుగుతుంది.

కొన్ని సమయాలలో అజీర్ణం చేసి బిడ్డ కడుపునొప్పితో బాధపడుతూ ఉంటుంది. కుమిలిపోయే బిడ్డను చూసి ఆకలేమోనని భావించి తల్లి పాలనిస్తుంది. దానివలన బాధ పెరుగుతుందే గాని తరగదని తల్లి గ్రహించదు.

పొట్ట ఉబ్బిపోతూ ఉంటుంది. ఈ బాధను భరించలేక బిడ్డ విలపిస్తూ ఉంటుంది. బిడ్డను సముదాయించే ప్రయత్నంలో ఆడవాళ్ళు బిడ్డను ఎత్తుకుని బంతిని ఎగురవేసినట్లు బిడ్డను పైకి ఎగురవేసి పట్టుకుంటూ ఉంటారు. అలా వారు ఎగురవేస్తుంటే శిశువుకు పంచప్రాణాలు లేచిపోయినట్లే ఉంటుంది.

ఒకరి విలాపం మరొకరికి విలాసమా? ఒకరి ఆవేదన మరొకరికి ఆనందమా? ఆహా! ఏమి ఈ సృష్టి వైచిత్ర్యం? ఏమి ఈ జీవి దౌర్భాగ్యం.

బిడ్డడైన జీవుడు అయోమయంగా, అమాయకంగా జీవిస్తుంటాడు. తన అభిప్రాయాలు ఎరుగనివారిద్వారా పెరుగుతూ ఉంటాడు. మంచములోని నల్లులు, పరుపుపైన ఉన్న దోమలు కుట్టుతుంటే బిడ్డ రోదిస్తూ ఉంటాడు. బిడ్డ నిద్రించడానికి విలపిస్తున్నాడని తల్లి భావిస్తుంది. అతనిని నిద్రపుచ్చే ప్రయత్నంలో ఊయలలో వేసి ఊపుతుంది.



కొన్ని సమయాలలో నిద్ర ముంచుకు వచ్చి బిడ్డ ఏడుస్తూ ఉంటుంది. విషయం తెలియని తల్లి అప్పుడే బిడ్డకు స్నానం చేయిస్తుంది. పసితనంలో మనమందరం ఈ వైరుధ్యాల మధ్య పెరిగినవారమే. శైశవదశ అంతా ఇలాగే గడిచిపోతుంది. అంతేకాదు. ప్రారబ్దవశాత్తూ సంక్రమించే వ్యాధులు కూడా శిశువును తీవ్ర దుఃఖానికి గురి చేస్తాయి. ఇన్ని బాధలు చుట్టుముట్టినా ఒక్కనాడు కూడా పరమశివుని స్మరించడం జరగడం లేదు. ఈ దుష్టపరిణామాలన్నీ పరమేశ్వరుని విస్మరించడం వలన కలిగిన ఫలితాలే.

"ప్రభూ! పరమశివా! అపరాధిని. క్షంతవ్యుడను. అక్షయస్వరూపా! నన్ను క్షమించు!"




**ప్రౌఢోఽహం యౌవనస్థో విషయ**
**విషధరైః పంచభిర్మర్మ సంధౌ**
**దష్టో నష్టో వివేకః సుతధనయువతి**
**స్వాద సౌఖ్యే నిషణ్ణః**
**శైవే చింతా విహీనం మమ హృదయ**
**మహో మాన గర్వాభిరూఢం**
**క్షన్తవ్యో మేఽపరాధ శ్శివ! శివ!**
**శివ! భోః శ్రీ మహాదేవ శంభో! 3**

*హే శంభో!* ప్రౌఢవయస్కుడ నయ్యాను. బాల్యం దాటి యౌవనంలో అడుగుపెట్టాను. శబ్దాది విషయాలనే పంచనాగులు కాటువేయగా నా విచక్షణాజ్ఞానం నశించింది. బిడ్డలు, ధనం, భార్య మొదలైన విషయానుభవంలో నేను మునిగిపోయాను. *పరమశివా!* నీయందు భక్తిని విస్మరించాను. నా హృదయం అభిమాన, గర్వాలతో నిండిపోయింది. *హే శివా! పరమశివా! శంభో! మహాదేవా!* నన్ను క్షమించు. ఇదీ శ్లోక తాత్పర్యం.

నడకరాని దశలో నరకయాతన అనుభవించి జీవి బాల్యం దాటుతాడు. దేహం గట్టిపడుతుంది. మనస్సు ఆలోచనల్ని జోరుగా కదిలిస్తుంది. నరాల ఉద్రిక్తత, సంకల్ప తీవ్రత జీవుని ప్రశాంతంగా ఉండనివ్వవు. యౌవనచాంచల్యం ముందు వెనుకలు చూడనివ్వదు. పాముకాటుకు గురైనవాడు మతితప్పి ప్రవర్తించునట్లు, శబ్దాది విషయాలనే సర్పాల వల్ల గాయపడిన జీవుడు మతి తప్పి నడక సాగిస్తాడు. విచలిత మనస్కుడవుతాడు.

బాహ్యంలోని గాజుల ధ్వనులు ఆంతర్యంలోని మోజులను కదిలిస్తాయి. బాహ్యంలోని సుందర దృశ్యాలు ఆంతర్యాన్ని కలుషితం చేస్తాయి.కల్లోల శబ్దాలకు, మర్మధ్వనులకు కర్ణభేరి అలవాటుపడి ఆనందించడం ప్రారంభిస్తుంది. రమణుల రమణీయ సొగసులను ప్రతిఫలింప చేయడానికి రెటీనా సిద్ధపడుతుంది.

యౌవనవంతుడు కళ్ళుండి చూడలేని వాడవుతాడు. చేవులుండి వినలేని వాడవుతాడు. మంచిచెడులను గూర్చి ఆలోచించే స్థాయిని మనసు కోల్పోతుంది. ఆంతర్యపు అలజడికి బాహ్యాకృతి నిచ్చే ప్రయత్నంలో భార్య తోడవుతుంది. ఆవేశాలను ప్రదర్శించటంతో బిడ్డలు కలుగుతారు.

బిడ్డలను సరిజేసేందుకు సిరి అవసర మవుతుంది. అంతే పురిబెట్టి గుడ్డను పిండినట్లు బ్రతుకును పిండడం జరుగుతుంది. సిరిగల దొర అనే ప్రఖ్యాతి కూడా లభిస్తుంది.

గర్వం విజృంభిస్తుంది. అభిమానం ఆకాశాన్నంటుతుంది. భక్తి బలహీనతగా గోచరిస్తుంది. పూడిక తెలియని అగాధంలో పడిపోవడం జరుగుతుంది. చూస్తుండగానే మూడునాళ్ళ ముచ్చటగా యౌవనం జారిపోతుంది. సాధనకు అనువైన యౌవనాన్ని పాడుచేసుకొని, రోదనకు నిలయమైన వార్ధక్యంలో ప్రవేశించడం అనివార్య మవుతుంది.

యౌవనం అతి భయంకరమైనది. కామక్రోధాలు, ఆవేశాలు, అనర్థాలు ఈ దశలోనే పడగలు విప్పి నాట్యం చేస్తుంటాయి. అభిమానం ప్రతిక్షణ వర్ధమానమవుతూ ఉంటుంది. అహంకారం క్షణక్షణమూ దర్శనమిస్తూ ఉంటుంది. పడిన బాధలను అన్నింటినీ విస్మరించి మూఢుడైన జీవుడు మరల సంసారమనే సుడిగుండంలో పడి పరిభ్రమిస్తూ వుంటాడు. దుష్ట సహవాసాన్ని అభిలషిస్తాడు గాని శిష్టుల స్నేహం అభి లషించడు.

స్త్రీల సాంగత్యాన్ని కాంక్షిస్తాడు. కామవాసనలతో చిత్తాన్ని దూషితం చేసుకుంటాడు. స్త్రీసౌందర్యం ఏమిటో విచారించడు.

***శ్మశానేషు దిగన్తేషు స ఏవ లలనాస్తనః***
***శ్వభి రాస్వాద్యతే కాలే లఘు పిండ ఇవాంధసః***

"శ్మశానంలో, దిగంతాలలో ఆ స్త్రీస్తనమే కాలక్రమేణా కుక్కలచే అన్నపు ముద్దవలె నమలబడుతున్నది" అని మహోపనిషత్తు ప్రవచించింది.



లింగభేదంతో సంబంధం లేకుండా ఎవరి దేహానికైనా ఇదే దుర్గతి ప్రాప్తిస్తుంది. కనుక ఆకర్షణలను అదుపు చేసుకోవాలి. వాస్తవాలను గ్రహించాలి.

"పరమశివా! ఆపద్బాంధవా! ఈ అగచాట్లు, గ్రహపాట్లు నాకెందుకు కలిగాయి? నిన్ను మరవడం వల్లనే గదా! మహేశ్వరా! భూతనాథా! క్షమించు తండ్రీ! ఈ దీనుని క్షమించు. బలహీనుని మన్నించు".



**వార్ధక్యే చేంద్రియాణాం విగత గతి**
**మతి శ్చాధిదైవాది తాపైః**
**ప్రాప్తై ర్రోగై ర్వియోగైః స్వన వసిత**
**వపుః ప్రౌఢి హీనం చ దీనమ్**
**మిథ్యా మోహాభిలాషై ర్భ్రమతి మమ**
**మనో ధూర్జటే ర్ధ్యాన శూన్యం**
**క్షన్తవ్యో మేఽపరాధ శ్శివ! శివ!**
**శివ! భోః శ్రీ మహాదేవ శంభో! 4**

హే శంభో! వార్ధక్యము ప్రాప్తించింది. ఇంద్రియములు అశక్తము లయ్యాయి. ఆధి దైవాది తాపములచే వ్యాధులు సంక్రమించాయి. రోగములకు తోడు వియోగములు చేరువ య్యాయి. శరీరము శిథిలమైనది. యౌవనము గతించింది. దీనుడను అయ్యాను. బలహీనుడను అయ్యాను. కానీ నా మనసు మాయాజగత్తుతో తగులుకొని వున్నదే కాని, ధూర్జటివైన నిన్ను ధ్యానించ లేకున్నది. హే! శివా! శివా! శంభో! మహాదేవా! నన్ను క్షమించు.

కాలం ఎవ్వరినీ కనికరించదు. కాలానికి ధర్మమే గాని దయ లేదు. కాలం పరుగు తీస్తుంటే యౌవనం పతనమవుతూ ఉంటుంది. వయస్సు విచిత్రమయినది. మూడు ముడులను బిగించిన బలమైన చేతులు తిరిగి చూసేసరికి ముడతలుపడి ఉంటాయి. ముసలితనం ప్రాప్తిస్తుంది.

వార్ధక్యం ప్రాప్తించింది. శరీరము దుర్బలమై దుర్భరంగా మారింది. ముఖం ముడతలు పడింది. చూసినందుకు రుసుం చెల్లించమంటూ అందమంతా అద్దము

అపహరించింది. భోగములు అనుభవించిన దేహము రోగాల పాలైంది. ఆకలి లేదు. నిద్ర పట్టదు. తిన్నదంతా దేహాన్ని పాడుచేసింది. విన్నదంతా చెవులను చెడగొట్టింది. చూసిందంతా చూపును వక్రింపచేసింది. పాతవన్నీ రోతలయ్యాయి. బ్రతుకు మోయలేని మోతగా తయారైంది వేదనలు వెన్నంటి నడుస్తున్నాయి. రోదనలు దారి చూపిస్తూ నడక సాగిస్తున్నాయి. జీవనరాగానికి పరితాపమే పల్లవి అయింది.

*బ్రతుకంతా రోదన ఆయె*
*సాధన సాగే క్షణమేదీ?*
*వెలుగులన్నీ వెతలే ఆయె*
*వేదన తీరే దారేదీ?* ॥బ్రతు॥
*భద్రమార్గము తెలియక నేటికి నిద్రించినది చాలదా?*
*పరుగిడు కాలం ఆగదు నీకై సాధన తెలిసి సాగిపో!* ॥బ్రతు॥
*రేపు ఉన్నదో రూపు లేనిదో నేటిని నమ్మి సాగిపో!*
*నేటికి యేటికి ఎంత దూరమో ఈ క్షణమే నీదని పలుకు!*
*పలికే నాలుక పలుకదు నాడు ఈ పలుకే పల్లవి నీకు!* ॥బ్రతు॥
*చీకటి మూసిన చింతల నడుమ ఆడిన ఆటలు చాలవా?*
*మృత్యుపాశము చెంతనున్నది సత్యమార్గమును గాంచవా?*
*తెర మూసిందా తనువే లేదు మర్మము నెరిగి సాగిపో!* ॥బ్రతు॥

వార్ధక్యం భయంకరమైనది. ఆవేశాలు అంతరిస్తాయి. నూతన అనుభవాలకు శరీరం సిద్ధంగా ఉండదు. గడచిన అనుభవాలు బ్రతుకును సరళంగా సాగనివ్వవు. ఇంద్రియాలు బలహీన మవుతాయి. ప్రయత్నిస్తే గాని ధ్వనులు వినిపించవు. పరీక్షించి చూస్తే గానీ రూపం రెటీనాపై నిలువదు. మరలన్నీ అరిగిపోయాయి. తెరలన్నీ పడుతున్నాయి. జీవితమే చెఱసాలగా మారింది. అవయవాలు సడలిపోతున్నాయి. మృత్యుకడలి వైపు నడుస్తున్నాయి.

బంధువులు గతిస్తున్నారు. ఆదాయం లేని జీవికి ఆదరణ కరువైంది. దీనత్వం సమీపించింది. బలహీనత్వం తోడైంది. గతస్మృతులు మనోఫలకం మీద చలనచిత్రాలలాగా నడుస్తున్నాయి. మమతలు వీడని మనసు, మర్మం ఎరుగని బుద్ధి మాయాప్రపంచంలోకి కూరుకపోతున్నాయి గాని మాయాధీశుడైన మహేశ్వరుని పొందడానికి ప్రయత్నించలేక పోతున్నాయి.



తీగలు తెగిన వీణలో ఏ రాగం పలుకుతుంది? మూత చెడిన మృదంగం ఏ ధ్వనిని వినిపిస్తుంది? అంతా అరణ్యరోదనే! ధూర్తురాలైన మనసు దురాలోచనలతో దుర్మరణాన్ని పొందుతోంది. దుర్గతిని అనుభవిస్తోంది. ధూర్జటిని ధ్యానించి తరించలేకపోతోంది.

మనసు చంచలమైనది. చపలమైనది. పులివిస్తరి వలె ఎగురుతూ ఉంటుంది. ఈ భ్రమణమంతా దేనికోసం? కోరికలను తీర్చుకొనేందుకు! మరి కోరికలు తీరుతాయా? తీరవచ్చును, లేదా తీరకపోవచ్చును. తీరినట్లయితే మళ్ళీ మళ్ళీ అదే కావాలని మనసు కోరుతుంది.

ఒకవేళ తీరకపోతే తీవ్రదుఃఖంతో అలమటిస్తుంది. ఆవేదన చెందుతుంది.

మనసు ఆగ్రహానికి అలవాటుపడిందే గాని నిగ్రహాన్ని అలవరచుకోలేదు. నిగ్రహం లేని మనసు భగవంతుని అనుగ్రహం ఎలా పొందుతుంది? కనుక అదొక దుష్టగ్రహం లాగ జీవిని ఏడిపిస్తూ ఉంటుంది. వృద్ధాప్యంలో మరీ భయంకరంగా ఏడిపిస్తుంది.

నవ్వే జీవి నగుబాట్లకు గురయ్యేది ఎంతసేపు? ఏ క్షణాన్నయినా గాలం నీళ్ళలో ప్రవేశించవచ్చు. చేప ప్రాణాన్ని అపహరించవచ్చు. కాలుడు ఏ నిముషమైనా మనల్ని చేరవచ్చు. మృత్యువును అందించవచ్చు. అహంకార వాలం త్రిప్పుతూ తిరుగుతుంటే కాలంలో మృత్యుగాలం వాత పడక తప్పదు.

బావిలో పడిన వాడి చుట్టూ నీరే ఉంటుంది. సంసారకూపంలో పడిన వాడికి చుట్టూ నిరాశే ఉంటుంది. బావిలో పడిన వాడికి గాలి, వెలుతురు దొరకవు. సంసార కూపంలో పడిన వాడికి స్వేచ్ఛ అనే గాలి దొరకదు. శాంతి అనే వెలుగు లభించదు.

ఇదొక దీనావస్థ. హీనావస్థ. దీనులైన వారికి దిక్కెవరు? హీనులైన వారికి గతి ఎవరు?

కూపంలో పడిన వానికి చేయి అందించి కనికరించే వారుండాలి. సంసార కూపంలో పడి దీనావస్థలో కుములుతున్న దీనుడికి చేయూత ఇచ్చి, చేరదీసి, చింతలను దూరం చేసి స్వాంతమును కలిగించే వారెవరు? పరమశివుడే! భూతనాథుడే! కానీ మనసు ప్రపంచంలో పరిభ్రమిస్తుందే గాని పరమాత్మను ధ్యానించి తరించలేదు.

"హే దీననాథా! దయామయా! దినాలన్నీ కాలంలోనే కరిగిపోయాయి. నిన్ను చింతించేందుకు క్షణాలు కూడా కరువయ్యాయి. క్షమించమని అర్థించేందుకు అర్హుడను కాను. నీ దయామృత చూపులే నా బ్రతుకు నావకు చుక్కాని కావాలి".



**స్నాత్వా ప్రత్యూషకాలే స్నపనవిధి**
**విధౌనాఽహృతం గాంగతోయం**
**పూజార్థం వా కదాచి ద్బహుతర**
**గహనా త్ఖండ బిల్వీదలాని**
**నాఽనీతా పద్మమాలా సరసి వికసితా**
**గంధ పుష్పై స్త్వదర్థం**
**క్షన్తవ్యో మేఽపరాధ శ్శివ! శివ!**
**శివ! భో: శ్రీ మహాదేవ శంభో! 5**

ప్రాత:కాలంలో నిద్రలేచి స్నానం చేసి నీ అభిషేకానికి గంగోదకం ఏనాడూ తీసుకు రాలేదు. దట్టమైన అరణ్యాలలో ప్రవేశించి నీ పూజకు అఖండ బిల్వపత్రాలను సేకరించలేదు. సరోవరంలో వికసించి పరిమళించే పద్మాలతో గుచ్చిన పుష్పహారం నీకు తీసుకురాలేదు. *హే శివా! శివా! శంభో! మహాదేవా! నన్ను క్షమించు!*

ప్రారంభంలో సాధకునికి పూజ చక్కని సాధనసోపానం. నిత్యార్చన జరిగిన తర్వాత భక్తుడు తన నిత్యకృత్యాలలో ప్రవేశించాలి. పూజలో దేహేంద్రియ మనోబుద్ధులు స్థిరపడి ఉంటాయి. పూజచేయు సాధకుడు పూజాద్రవ్యాలను ముందుగా తానే సిద్ధపరచుకోవాలి. శ్రద్ధతో కూడిన భక్తి సత్ఫలితాలను ఇస్తుంది. భక్తిని ఆచరించుటయే మనిషి ప్రథమకర్తవ్యం. ధర్మం ద్వారా జ్ఞానం లభిస్తుంది.

**"ధర్మో మద్భక్తికృత్ ప్రోక్తో జ్ఞానం చైకాత్మ్య దర్శనమ్"**

"పరమాత్మయందు భక్తిని నిలపడమే ధర్మం. సర్వత్ర పరమాత్మను దర్శింపచేసేది జ్ఞానం" అని శ్రీకృష్ణుడు శ్రీ మద్భాగవతంలో ఉద్ధవునికి ప్రబోధించాడు.



అర్చన చేయు భక్తుడు శరీరశుద్ధిని కలిగి ఉండాలి. స్నానాదులను విధిగా ఆచరించాలి. స్నానం వల్ల దేహం శుద్ధి పడుతుంది. కానీ స్నానం చేయు సమయంలో భగవన్నామం ఉచ్చరించినట్లయితే దేహశుద్ధితో పాటు మనోశుద్ధిని కూడా పొందవచ్చు.

**స్వదేహ మల నిర్మోక్షో మృజ్జలాభ్యాం మహామునే**
**యత్తచ్ఛౌచం భవేద్బాహ్యం మానసం మననం విదు:**

"మట్టితోను, నీటితోను తన దేహంలోని మాలిన్యాన్ని తొలగించుకోవడం బాహ్యశౌచం. భగవంతుని ధ్యానం చేయడం మానసశౌచం" అని దర్శనోపనిషత్తు నిర్ణయించింది.

"శివా! ప్రాత:కాలమునే నిద్రలేచి, స్నానాదులు పూర్తి చేసుకుని, నీకోసం గంగాజలం తీసుకుని రాలేకపోయాను. నా ఈ అపరాధం క్షమించు".

సూర్యోదయానికి ముందే పక్షులు మేల్కొంటాయి. ఆమాత్రం నియమం కూడా మనిషి పాటించలేక పోతున్నాడు.

బ్రహ్మముహూర్తాన భక్తుడు మేల్కొని ఉండాలి. స్నానాదులు పూర్తి చేసుకోవాలి.

**స్నానం మనోమల త్యాగ:**

"మనస్సులోని మాలిన్యాన్ని త్యాగం చేయడమే నిజమైన స్నానం" అని స్కన్దోపనిషత్తు నిర్వచించింది.

**కర్మ స్వ సంగమః శౌచం త్యాగః సంన్యాస ఉచ్యతే**

కర్మలయందు ఆసక్తి లేకుండా ఉండటం శౌచమని, కోరికలను పూర్తిగా త్యజించడం త్యాగమని భాగవతం నిర్ణయించింది.

స్నానం ద్వారా శౌచం లభించాలి. కర్మలయందు ఔదాసీన్యము కలగాలి. కోరికల సంతగోలలో పరిభ్రమించే వాడు భక్తుడు కాలేడు. కానీ ఇంతవరకు ఈ విధమైన స్నానానికి, శౌచానికి నోచుకోలేదు. ఇది శివాపరాధము గాక మరేమవుతుంది?

"శివా! మరొక అపరాధాన్ని కూడా చేశాను. అడవులకి వెళ్లి నీ పూజకోసం అఖండ బిల్వపత్రాలను సేకరించలేక పోయాను. నన్ను క్షమించు తండ్రీ!"

సంకల్ప వికల్పాలతో కలసిన మనస్సే భయంకరమైన అరణ్యం! అఖండ బ్రహ్మాకారవృత్తియే అఖండ బిల్వపత్రం. అట్టి బిల్వపత్రాన్ని అనగా మనస్సుని మహేశ్వరునికి సమర్పించలేక పోయాము అని భావము.

అంతేకాదు. మరొక అపరాధము కూడా జరిగిపోయినది. సరోవరాలలో వికసించిన సుగంధభరితమైన పద్మాలతో కూర్చిన పుష్పహారం పరమశివునికి సమర్పించలేక పోయాను.

మానవుని బుద్ధే సరోవరం. పద్మం జ్ఞానానికి సంకేతం. పరిమళించే పద్మాలతో కూడిన పుష్పహారం సమర్పించలేదు అంటే బుద్ధిలోని వాసనలను త్యజించలేక పోయాను అని భావం.

పూజకు పూలు అవసరం. సుగంధభరితమైన సుమాలే పూజకు ఉపకరిస్తాయి. వాసన లేని పూలను సాధారణంగా పూజకు ఉపయోగించరు. అలాగే మన బుద్ధిలో అనేక వాసనలు ఉంటాయి. ఈ వాసనలను భగవంతునికి సమర్పించి తరించాలి. వాసనల చేత మలినమైన బుద్ధి ద్వైతమును చూస్తుంది. బుద్ధిలోని వాసనలను సమర్పించగానే బుద్ధి వాసనారాహిత్యం పొందుతుంది. అట్టి స్థితిలో ద్వైతము అదృశ్యమై అద్వైతము భాసిస్తుంది.

"పరమశివా! సమయాన్ని మరచి నిద్రపోయాను. నియమాన్ని వదిలి చరించాను. శౌచము తెలియని జీవితాన్ని కొనసాగించాను. నిగ్రహం తెలియక జీవించాను. వాసనలను త్యజించలేక పోయాను. వృత్తులను నిరోధించలేక పోయాను. ఇంతకన్నా అపరాధం ఏముంది? అన్యాయం ఏముంది? అధర్మజీవనానికి అలవాటుపడిన ఈ దీనుని క్షమించు తండ్రీ! అతి దీనుడను! హీనుడను! బలహీనుడను!

**దుగ్ధైర్మధ్వాఽజ్య యుక్తై ర్దధి గుడ**
**సహితైః స్నాపితం నైవ లింగం**
**నోలిప్తం చందనాద్యైః కనక విరచితైః**
**పూజితం న ప్రసూనైః**
**ధూపైః కర్పూరదీపైః వివిధ రసయు**
**తై ర్నైవ భక్ష్యోపచారైః**
**క్షన్తవ్యోమేఽపరాధశ్శివ! శివ!**
**శివ! భోః శ్రీ మహాదేవ శంభో!** 6

*హే ప్రభో! లింగమూర్తీ!* క్షీరము, తేనె, నెయ్యి, పెరుగు, శర్కర అనే పంచామృతములతో నిన్ను ఎన్నడూ స్నానము చేయించలేదు. అగరు చందన కర్పూరాదులను అనులేపనము చేయలేదు.





సువర్ణపుష్పములతో నిన్ను అర్చింపలేదు. ధూపదీప కర్పూరాదులతో నీరాజనము సమర్పించలేదు. షడ్రసోపేతమైన భక్ష్యములను నివేదించలేదు. కనుక *శివా! పరమేశ్వరా! శంభో! నా అపరాధమును క్షమింపుము.*

శివుడు అభిషేకప్రియుడు. పంచామృత స్నానమును పరమేశ్వరుడు సదా వాంఛించును. క్షీరము, తేనె, నేయి పెరుగు, పంచదారలతో కూడినదియే పంచామృతము. ఈ పంచామృతములతో భక్తులు శివుని అర్చించుచుందురు. ఇది స్థూలమైన అర్చన.

సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు అయిన పరమశివుడు సూక్ష్మరూపుడై యున్నాడు. సూక్ష్మరూపుడైన పరమేశ్వరుడే స్థూలరూపమున లింగమూర్తిగా దర్శన మిచ్చుచున్నాడు. స్థూలమైన శివలింగమును మనము అర్చించినను అది సూక్ష్మరూపుడైన సదాశివునకే చెందును.

పరమశివుడు సూక్ష్మరూపమున చైతన్యమయుడుగను, స్థూలరూపమున లింగమూర్తిగను తెలియుచున్నాడు. మనము చేయు శివార్చన కూడా స్థూల సూక్ష్మములకు సంబంధించినదియై ఉండాలి. మధుక్షీరఘృత దధి శర్కరాయుతమైన పంచామృతములతో లింగమూర్తిని అర్చించుట స్థూలార్చన యగుచున్నది. మరి సూక్ష్మమైన అర్చన ఎలా సాగాలి? సూక్ష్మమైన సేవ మనస్సునకు సంబంధించినది గనుక అది భావప్రధానమై యుండాలి.

పంచామృతములలో మొదటిది క్షీరము. పాలు సారభూతమైన ఆహారము. సమీకృత ఆహారము. మన బుద్ధియందలి జ్ఞానమే ఇచ్చట క్షీరమునకు సంకేతము. ప్రపంచమును గ్రహించుటకు చరించే బుద్ధిని పరమాత్మ వైపునకు మరలించాలి. అప్పుడు బుద్ధిని భగవంతునికి సమర్పించినాము అని భావము. పంచామృత స్నానము నందు క్షీరమునకు గల విశేష మిదియే.

పంచామృతములలో రెండవ పదార్థము తేనె. ప్రతి మనిషి తన ఆంతర్యములో తీయని విషయపిపాసను కలిగియుండును. విషయసుఖాలలో వాస్తవానికి తీపి లేదు. అవి తీపి రాసిన చేదు మాత్రలు. ఆరంభమునందు తీయగా ఉండి అంత్యమున చేదు చేదుగా మారుచుండును. ఆదియందు అమృతము వలె అగుపించి, చివరన విషముగా మారుచుండును.

**విషయాన్ విషవత్ త్యజ**

విషయములను విషములుగా భావించి త్యజించుము అని అష్టావక్రమహర్షి జనకమహారాజుకు చెబుతాడు.

కనుక విషయపిపాస యనెడి తీయని తేనెను పరమశివునికి సమర్పించాలి. అప్పుడే మనము నిర్విషయానంద సాగరములో ఓలలాడగలము. పంచామృత స్నానములో తేనెను సమర్పించడములోని అంతర్భావ మిదే.

ఇక మూడవది ఘృతము. మనము అనేక కర్మల నాచరించు చుందుము. ఆ కర్మల యొక్క ఫలితములను అనుభవించు చుందుము. ఈ అనుభవములకు సంబంధించిన అనుభూతులు హృదయములో తిష్ఠవేసి యుండును. వీటినే వాసనలు అందుము. ఈ వాసనల ప్రేరణ చేత మరల మనుజుడు నూతన కర్మల నాచరించుచుండును. వాసనలు ప్రక్షాళన మైనచో కర్మాచరణము జరుగదు. కనుక ఆంతర్యములో సంస్కారము లనెడి వాసనలను పరమశివునికి సమర్పించుటయే నేయి సమర్పించుటలోని అంతర్భావము.

నాల్గవది పెరుగు. ఆధ్యాత్మికంగా పెరుగుదల నాశించువారు ఈ పెరుగు యొక్క అంతరార్థమును గ్రహించి దానిని పరమశివునికి సమర్పించాలి.

దేహాత్మభావము గలవారి యందు అభిమానము తిష్ఠవేసి యుండును. అది పెరుగువలె గడ్డకట్టి యుండును. కొందరికి విద్యాభిమానము, కొందరికి ధనాభిమానము, కొందరికి కులాభిమానము, కొందరికి రూపాభిమానము, ఇక కొందరికి దేహాభిమానము, మరికొందరికి అభిమానము లేదనెడి అభిమానము - ఇలాంటి అనేక అభిమానముల చేత వ్యక్తుల మనస్సులు కలుషితమై యుండును. వ్యక్తుల ఆంతర్యములలో గడ్డకట్టి యున్న అభిమాన మనెడి పెరుగును ఆదిదేవునికి సమర్పించాలి. ఇదియే పెరుగును సమర్పించుటలోని విశేషార్థము.

పంచామృతములలో చివరిది పంచదార. ఇది తియ్యనిది. ప్రతి జీవికి అహంకారము అత్యంత మధురముగా తెలియుచుండును. "నేను" అనెడి అహంకారముతో ప్రతి మనిషి ఊగిపోవుచుండును. ఈ తీయని అహంకార మనెడి పంచదారను కూడా లింగమూర్తికి సమర్పించాలి. ఇదియే పంచామృతస్నానము.

కానీ, పరమశివా! ఈవిధమైన పంచామృతస్నానమును ఎన్నడూ నేను చేయించలేదు. జ్ఞానముతో జీవించలేక విషయపిపాసను వీడలేక, వాసనలను దూరం చేసుకోలేక, అభిమానమును అంతమొందించలేక, అహంకారమును వశింప చేయలేక బ్రతుకంతా వ్యర్థముగా గడిపిన క్షుద్రజీవిని. రుద్రమూర్తీ! నీవే నాకు భద్రమును కల్పించాలి. దరిద్రమును తొలగించాలి. అజ్ఞాననిద్ర నుండి మేల్కొని జ్ఞాన వెలుగులో చరించేలా ఆశీర్వదించాలి.



పంచామృత స్నానమును చేయించలేదు. దానికి తోడు అగరు చందన కర్పూరాదులను అనులేపనము చేయలేదు. వాసనాత్రయమును విసర్జించుటయే ఈ అనులేపనములోని అంతరార్థము. అగరనెడి లోకవాసనను, చందన మనెడి శాస్త్రవాసనను, కర్పూర మనెడి దేహవాసనను పరమేశ్వరునికి సమర్పించాలి. అప్పుడే జీవికి ధన్యత చేకూరును.

సువర్ణ పుష్పములతో లింగమూర్తిని అర్చించలేదు. సత్యదేవుని ముఖము స్వర్ణపాత్రచే కప్పబడి ఉన్నదని ఈశావాస్యోపనిషత్తు ప్రవచించినది. స్వర్ణము మాయకు సంకేతము. కనుక మాయాజనితమైన త్రిగుణములను పరమాత్మకు సమర్పించలేదు అని భావము.

ఆత్మార్పణ యనెడి భావము అలవడుట లేదు. ఈ భావము స్థిరపడి ఆత్మ పరమాత్మకు అర్పణము గావింపబడుటయే కర్పూరహారతి.

"హే పరమశివా! పరమాత్మా! షడ్రసోపేతమైన నైవేద్యములను నీకు సమర్పించలేదు. నన్ను క్షమించు"

ప్రాపంచిక విషయానుభూతికి మనసు ఎగిరి పడుచున్నదే గాని రుచులను నీకు సమర్పించి, నీపై అభిరుచిని పెంచుకొని జీవింపలేకున్నది. పరమశివా! ఇది నా మనసుకు పట్టిన దురవస్థ. బ్రతుకుకు కలిగిన దీనావస్థ. క్షమించు తండ్రీ! 'ఏదీ చేయలేకపోయాను' అని నీకు చెప్పుకొనుటయే ఇప్పుడు నేను చేయగలిగింది. క్షమించు శివా! నన్ను క్షమించు.



**నోశక్యం స్మార్తం కర్మప్రతిపద**
**గహన ప్రత్యవాయా కులాఢ్యం**
**శ్రౌతే వార్తా కథం మే ద్విజకుల**
**విహితే బ్రహ్మ మార్గానుసారే**
**తత్త్వే ఽ జ్ఞాతే ఽ విచారే శ్రవణ మన**
**నయోః! కిం నిదిధ్యాసితవ్యం**
**క్షన్తవ్యో మే ఽ పరాధ శ్శివ! శివ!**
**శివ! భోః ! శ్రీ మహాదేవ శంభో!7**

ప్రభో!మహాదేవా! శాస్త్రవిహితమైన స్మార్తకర్మలను ఆచరించలేదు. బ్రహ్మ మార్గానువర్తులకు చెప్పబడిన శ్రౌతకర్మ

**లను కూడా ఆచరించలేదు. శ్రవణ మననాదులను సాగించలేదు. ఇక నిదిధ్యాస నాకు ఎలా కలుగుతుంది? హే శివా! నన్ను క్షమించు. అపరాధాలకు అలవాటు పడిన వాణ్ణి. క్షమించు ప్రభూ!**

శివభక్తికి నోచుకోని వారికి మిగిలేది అధోగతే. దుష్టప్రవర్తన దుర్గతిని ప్రసాదిస్తుంది. పరమేశ్వరుని మరచి జీవించే వారికి పతనమే ప్రతిఫలం.

కర్మమార్గం అతి కష్టమైంది. స్మృతులలో చెప్పబడిన కర్మలను ప్రారంభించి మధ్యలో ఆపితే కర్మ దోషయుత మవుతుంది. ఈ కర్మలను అవధానంతో ఆచరించలేక మనుజులు స్మార్తకర్మలను త్యజిస్తారు. బ్రహ్మమార్గంలో చరించే ద్విజులకు శ్రుతులలో ప్రత్యేకంగా కర్మమార్గం చెప్పబడింది.

ముముక్షువు మొదట మనసును శుద్ధి చేసుకోవాలి. దీనినే సమకార్యం అంటారు. మనోశుద్ధి లేనివారికి ధ్యానం అసంభవం. శుద్ధదర్పణంలో వస్తువు ప్రతిఫలించినట్లు శుద్ధబుద్ధిలో ఆత్మచైతన్యం ప్రతిఫలిస్తుంది.

ఆత్మజ్ఞానాన్ని ఆశించేవారు ధ్యానజీవితానికి అలవాటు పడాలి. ధ్యాన జీవితమే ధన్యజీవితం. ధ్యానం నిర్విఘ్నంగా సాగడానికి మననం స్థిరంగా వుండాలి. మననం స్థిరపడడానికి ప్రధానమైనది శ్రవణం. గురువు లభించినపుడే శ్రవణం ప్రాప్తిస్తుంది. గురువును పొందడానికి శిష్యునికి అంతఃకరణశుద్ధి ఉండాలి. అది శుద్ధి కార్యం ద్వారానే లభ్యం కావాలి. కర్మాచరణంలో నిష్ణాతుడైన వాడికే అంతఃకరణం శుద్ధిపడుతుంది.

హే పరమశివా! కర్మాచరణంలో శుద్ధిని పొందలేని దుర్బలుణ్ణి. సద్గురు సాన్నిధ్యం పొందలేని వ్యర్థజీవిని. శ్రవణం లభించని నాకు మననం ప్రాప్తిస్తుందా? శ్రవణమననాదులు లేని నేను ధ్యానం ఎలా కొనసాగించేది? ధన్యత తెలియని నాకు దౌర్భాగ్యమే ధ్యానమైంది. ధ్యాన మేమిటో తెలియదు. ధ్యేయ మేమిటో తెలియదు. ధ్యాత ఎవరో అర్థంకాదు. హేయమైన బ్రతుకు శ్రేయాన్ని గ్రహించలేక పోయింది. వ్యర్థమైన బ్రతుకు పరమార్థాన్ని గ్రహించలేక పోయింది. క్షమించు ప్రభూ! క్షమించు! ఈ దీనుణ్ణి అనుగ్రహించు.

ఆత్మజ్ఞానం పరమోత్కృష్టమైనది. అది అప్రమేయం, అచింత్యం, అసమానం, అద్వితీయం, అద్భుత మైన ఈ ఆత్మజ్ఞానం పొందలేని దుర్బలులకు బోధపడడానికి సులభమార్గాలు శాస్త్రంలో చెప్పబడ్డాయి. అవే ఉపాసనలు.



మనసుతో చేసేది ఉపాసన. దేహంతో చేసేది కర్మ. ఈ ఉపాసన లన్నీ చిత్తశుద్ధి కొరకు నియమింపబడ్డాయి. ఉపాసనల వలన భగవత్కృప లభిస్తుంది. భగవత్కృపతో జ్ఞానం ప్రాప్తిస్తుంది.

**ఈశ్వరార్పితం నేచ్ఛయాకృతం**
**చిత్త శోధకం ముక్తిసాధకం**

"ఈశ్వరార్పణబుద్ధితో ఆచరించిన నిష్కామకర్మలు మనస్సును శుద్ధి చేసి ముక్తికి సాధనాలు అవుతున్నాయి" అని భగవాన్ శ్రీరమణమహర్షుల వారు ఉపదేశసారం అనే గ్రంథంలో తెలిపి ఉన్నారు.

కర్మలు మనిషిని బంధిస్తాయి. కర్మలు అజ్ఞానజనిత మైనందున జీవుని బంధిస్తాయి. నిష్కామకర్మ మనిషిని విడుదల చేస్తుంది. బుద్ధిని శుద్ధిచేసి ముక్తి మార్గం సుగమం చేస్తుంది.

కర్మలను రెండు విధాలుగా విభజింపవచ్చు. (1) లౌకికకర్మలు (2) శాస్త్ర కర్మలు.

నిత్యావసరాలకు ఉపకరించేవి లౌకికకర్మలు. శ్రౌతకర్మ, స్మార్తకర్మ, వ్రతాది పౌరాణికకర్మలు శాస్త్రకర్మలని చెప్పబడ్డాయి.

కర్మ పరిమితమైనది. కర్మలో కర్మకు సంబంధించిన పరిమితజ్ఞానమే ఉంటుంది. కర్మ వలన ప్రారబ్ధం నశిస్తుందే గాని సంచిత, ఆగామి కర్మలు నశించవు. కర్మలు ఆద్యంతాలను కలిగి పరిమితమై ఉంటాయి. కనుక వాస్తవానికి కర్మ మనిషికి శత్రువు వంటిది. శత్రువు ఈ జన్మలోనే బాధపెడతాడు. కర్మశత్రువు జన్మాంతరాలలో కూడా ప్రవేశిస్తుంది. కనుక కర్మ ద్వారా జ్ఞానం లభించదు.

**"నహి తమ స్తమసో నివర్తకమ్"**

"చీకటి ద్వారా చీకటిని పోగొట్టలేం. అలాగే కర్మ ద్వారా అజ్ఞానాన్ని నివృత్తి చేయలేం" అని శ్రీశంకరులు భాష్యంలో తెలిపారు.

కనుక కర్మ జ్ఞానాన్ని ప్రసాదించలేదు. కానీ ఈ కర్మమే నిష్కామభావంతో ఆచరించినపుడు సమకార్యం జరుగుతున్నది. బుద్ధి శుద్ధిపడుతున్నది. శుద్ధబుద్ధి మోక్షగామి అవుతున్నది.

ఏవిధమైన కర్మాచరణానికీ నోచుకోని మందభాగ్యునికి బ్రతుకులో అందం గోచరించదు. ఆనందం లభించదు. మనసు కల్మష మవుతుంది. కలుషితమైన మనస్సు శ్రవణానికి పనికిరాదు. మననానికి ఉపకరించదు. ధ్యానానికి సిద్ధపడదు.

"హే పరమశివా! కర్మ స్వభావం ఎరుగని వాణ్ణి. నిష్కామకర్మలు తెలియని వాణ్ణి. సమకార్యం ప్రాప్తించని వాణ్ణి. సమబుద్ధి సిద్ధించని వాణ్ణి. శ్రవణం చేయలేదు. మననం సాగించలేదు. ధ్యానం ఆచరించలేదు. బ్రతుకంతా పాడైపోయింది. ముక్కలవుతున్న నా జీవననౌకను ఒడ్డుకు చేర్చి ఆశీర్వదించవలసిన వాడివి నీవే. ప్రభూ! నేను దీనుణ్ణి. నిస్సహాయుణ్ణి. కరుణించు ప్రభూ! కరుణించు. ఈ దీనుని అనుగ్రహించు."



**నగ్నో నిస్సంగ శుద్ధ స్త్రిగుణ**
**విరహితో ధ్వస్త మోహాంధకారో**
**నాసాగ్రేన్యస్త దృష్టి ర్విదిత భవగుణో**
**నైవ దృష్టః కదాచిత్**
**ఉన్మన్యాఽవస్థయా త్వాం విగత**
**కలిమలం శంకరం న స్మరామి**
**క్షన్తవ్యో మేఽపరాధ శ్శివ! శివ!**
**శివ! భో: శ్రీ మహాదేవ శంభో! 8**

దిగంబరుడు, నిస్సంగుడు, పరిశుద్ధుడు, గుణాతీతుడు, మోహాంధకారం పారద్రోలిన వాడు, నాసాగ్రాన దృష్టిని సారించినవాడు, సంసార గుణదోషాలను తెలిపిన వాడు నాకు గోచరించలేదు. జడమతినైన నేను అమనస్క స్థితిని చేరి నిన్ను దర్శించలేక పోయాను. హే శివా! శంభో! నన్ను క్షమించు.

మనస్సును నిగ్రహించిన వాడికే ముక్తి లభిస్తుంది. గురుదేవుని అనుగ్రహానికి నోచుకోనివాడు మనస్సును నిగ్రహించలేడు. అమనస్కస్థితిని చేరలేడు. అమనస్క స్థితిని చేరలేని వాడికి అమృతానందప్రాప్తి సిద్ధించదు.



**ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేద విభాగినే**
**వ్యోమ వ ద్వ్యాప్త దేహాయ దక్షిణామూర్తయే నమః**

"త్రిమూర్తులుగ తెలియువాడు, బోధాత్మ స్వరూపుడు, ఆకాశం వలె అనంతమైన శరీరం కలవాడు అయిన శ్రీదక్షిణామూర్తికి వందనములు."

దిక్కులనే అంబరంగా ధరించి ఉండడం వలన గురుదేవుడు దిగంబరుడైనాడు. దేహాత్మభావం పూర్తిగా విస్మరించినవాడు దిగంబరుడు.

గురుదేవుడు ముక్తపురుషుడు. అతడు ప్రారబ్ధాధీనమైన దేహం ధరించి ఉన్నా దేహానికి పరిమితుడు కాడు. స్వప్నం నుంచి మేల్కొనిన వాడికి స్వప్నగత విషయాలు అసత్యాలని ఎలా తెలుస్తుందో ముక్తపురుషునికి ఈ దేహాదులు, వాటికి సంబంధించిన సుఖదుఃఖాలు అనిత్యాలని తెలుస్తుంది. మేల్కొనిన వాడికి స్వప్న విషయాలతో సంబంధం లేనట్లు ముక్తుడైన గురుదేవుడికి దేహాదులతో సంబంధం ఉండదు.

ఆకాశం అంతటా నిండి ఉన్నా దేనిచేతను లిప్తం కాదు. సూర్యుడు జలంలో ప్రతిబింబించినా జలం వలన తడపబడడు. వాయువు సర్వత్రా వీస్తున్నా సంగత్వం లేకుండా ఉంటాడు. దిగంబరుడైన గురుదేవుడు ప్రకృతిలో చరిస్తున్నా దానిచేత అంటబడడు.

దిగంబరుడైన గురుదేవుడు నిస్సంగుడు. ప్రాపంచిక విషయవాసనల నుండి పూర్ణంగా విడిపడిన వాడని భావం. విషయసుఖానుభవం పశ్వాదియోనులలో కూడా లభిస్తుంది. మోక్షం సిద్ధించుకొనే అవకాశం మానవుడొక్కడికే కలదని గుర్తించి అనిత్యమైన శబ్దాది విషయాల నుండి గురుదేవుడు విడిపడి ఉంటాడు. కర్తృత్వం మనిషికి బంధాన్ని కల్పిస్తున్నది. కర్తృత్వరాహిత్యం మోక్షాన్ని ప్రసాదిస్తున్నది.

దిగంబరుడు, నిస్సంగుడైన గురుదేవుడు గుణాతీతుడై ఉన్నాడు. సరళచింతనం చేయగల సత్త్వగుణాన్ని, కర్మలయందాసక్తి గల రజోగుణాన్ని, మందత్వం దించే తమోగుణాన్ని త్యజించి, గుణాలు మాయానిర్మితాలని గ్రహించి గుణాతీతుడై భాసిస్తూ ఉంటాడు.

**గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహ సముద్భవాన్**
**జన్మమృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే**

దేహానికి కారణాలైన త్రిగుణాలను అతిక్రమించినవాడు జన్మ మృత్యు వార్ధక్య దుఃఖాల నుండి విడిపడి మోక్షం పొందుతున్నాడు" అని భగవానుడు భగవద్గీతలోని 14వ అధ్యాయంలో తెలిపి యున్నాడు.

గుణాతీతుడైన గురుదేవుడు మోహాతీతుడు. అందువలన బంధమోక్షాలకు అతీతుడు. బంధమోక్షాలు మనస్సునకు సంబంధించినవి. మనస్సును అధిగమించిన వాడికి అవి లేవు.

గుణాతీతుడు, మోహాతీతుడైన గురుదేవుడు నాసాగ్రంలో దృష్టి నిలిపి ఉన్నాడు అనేది తర్వాతి లక్షణం. ఇది చూడగానే మనస్సును కలతపెట్టు విషయం వలె గోచరిస్తుంది.

**సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చానవలోకయన్**

దిక్కులపై దృష్టిని సారించక, నాసికాగ్రంలో దృష్టి నిలిపి సాధకుడు ధ్యానం ఆచరించాలని భగవద్గీత ఆత్మసంయమయోగంలో సూచించడం జరిగింది.

నాసికాగ్రంలో దృష్టి నిలపడం ధ్యానస్థితి. గుణాతీతుడైన వాడు నాసికాగ్రంలో దృష్టి నిలిపి ధ్యానం చేయవలసిన అవసర మేమున్నది? గురుదేవుడు ధ్యానాతీతుడు. కనుక నాసికాగ్రాన దృష్టిని నిలుపవలసిన అవసరం తనకు లేదు. అయినా శిష్యులను ఉద్ధరించే ప్రయత్నంలో ధ్యానం ఆచరించి చూపుతాడు. సంసార గుణదోషాలు తెలుసు కనుక శిష్యులను మాయారూప సుడిగుండంలో పడకుండా కాపాడతాడు.

**తస్మాత్సద్గురు కటాక్ష లేశ విశేషేణ సర్వసిద్ధయ స్సిధ్యన్తి, సర్వబంధాః ప్రవినశ్యన్తి, శ్రేయో విఘ్నా స్సర్వే ప్రలయం యాన్తి, సర్వాణి శ్రేయాంసి స్వయమే వాయన్తి**

గురుదేవుని లేశమాత్రమైన కృపావిశేషం చేత సర్వసిద్ధులు సిద్ధిస్తాయి. సర్వబంధాలు నశిస్తాయి. శ్రేయం పొందే ప్రయత్నంలో ఎదురయ్యే బహువిఘ్నాలు తొలగిపోతాయి. సమస్త శుభాలు వాటంతట అవే అరుదెంచుతాయి అని గురుదేవుని మహిమను త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్తు ప్రవచించింది.

"హే పరమశివా! అట్టి సద్గురువు నాకు లభించలేదు. నావంటి దురదృష్టవంతుడు మరొకడుండడు. గురువు అనుగ్రహం లేకుండా అమనస్క స్థితిని ఎలా సాధించగలను? శంభో మహాదేవా! కారుణ్యాపారీణా! నీవే నాకు గురువు. నీవే నా సర్వస్వం. నన్ను కడతేర్చవలసిన వాడవు నీవే. రక్షించు ప్రభూ! రక్షించు. ఈ దీనుని కరుణించి కాపాడు.





**హృద్యం వేదాంత వేద్యం హృదయ**<br>
**వరసిజే దీప్త ముద్యత్ప్రకాశం**<br>
**సత్యం శాంత స్వరూపం సకలముని**<br>
**మనః పద్మషండైకవేద్యం**<br>
**జాగ్రత్స్వప్నే సుషుప్తౌ త్రిగుణ**<br>
**విరహితం శంకరం న స్మరామి**<br>
**క్షన్తవ్యో మేఽపరాధ శ్శివ! శివ!**<br>
**శివ! భోః శ్రీమహాదేవ శంభో!** 9

పరమశివా! నీవు వేదవేద్యుడవు. ఉపనిషత్తుల ద్వారా తెలియదగిన వాడవు. హృత్పద్మంలో ప్రకాశించేవాడవు. నీవు ప్రకాశైక స్వరూపుడవు. సత్యరూపుడవు. శాంతరూపుడవు. మునిమానస సరోవరం అనే పద్మవనంలో గోచరించేవాడవు. అవస్థాత్రయానికి సాక్షివి. గుణాతీతుడవు. అట్టి నిన్ను ఎన్నడూ నేను స్మరించలేదు. క్షంతవ్యుడను. ప్రభూ! క్షంతవ్యుడను.

పరమశివుడు వేదవేద్యుడు. యజుర్వేదం శిరస్సుగా కలిగి శోభిస్తున్నాడు. రుద్రం ఆ దివ్యాత్ముడి ముఖం. పంచాక్షరి నేత్రం. వేదరూపుడై, వేదాల ద్వారా తెలియబడే మహేశ్వరుడు. భక్తుల హృదయాలలో దర్శనీయుడై ఉన్నాడు. సర్వగతుడై, అవ్యక్తస్వరూపుడైన పరమేశ్వరుని ధ్యానించగానే అఖండ ఏకరస పరిపూర్ణ చిత్స్వరూపం హృదయంలో అనుభవానికి అందుతుంది.

పరమేశ్వరుడు ప్రకాశైక స్వరూపుడు. దేహేంద్రియ మనోబుద్ధులు చరించడానికి ఆధారమైన జ్యోతిస్వరూపుడు. దేహేంద్రియాది సంఘాతం కాలాధీనమై నశిస్తుండగా, సత్యస్వరూపుడైన పరమేశ్వరుడు కాలాతీత పరబ్రహ్మగా ఉన్నాడు.

మనస్సును అధిగమించి ఉన్నందున అలజడులు తెలియనివాడై శాంతరూపుడై ఉన్నాడు. మునుల మనస్సులలో సంకల్పాలు అంతరించిన సమయాన స్వచ్ఛమై భాసించే నిస్తరంగ అంతఃకరణలో దివ్యప్రకాశంగ కన్పట్టుతున్నాడు. పరిమితమై, ఉపాధిసహితమైన అవస్థాత్రయానికి సాక్షిగా ఉన్నందున గుణాతీతుడై ఉన్నాడు. సర్వజీవులకు తానే ఆధారుడై ఉన్నాడు.

పర్వులకు మోక్షమే జీవితలక్ష్యంగా ఉంది. అది గుణాతీతస్థితి. సృష్టి స్థితిలయాదులను అధిగమించిన స్థితి. అట్టి మోక్షాన్ని అనుగ్రహించేవాడు పరమశివుడు.

**"మోక్షమిచ్ఛే న్మహేశ్వరాత్"**

"మోక్షం అనుగ్రహించేవాడు మహేశ్వరుడు." అట్టి మహేశ్వరుని స్మరించని బ్రతుకు ఎంత ఘోరమైనది? ఈ దుస్థితి ఎందుకు ప్రాప్తించింది? పరమేశ్వరుని ధ్యానింపవలసిన బుద్ధి ప్రపంచం వైపు పరుగుపెట్టడమే ఈ దుర్భర పరిస్థితికి కారణం.

మనస్సనే మర్కటం మోహమనే అరణ్యంలో పరిభ్రమిస్తున్నది. దారి తప్పిన చిత్త మర్కటం మాంసమయ సుఖాలను, క్షణికానందాన్ని అభిలషిస్తున్నదే గాని, మంత్రమయ జీవితానికి అలవాటు పడలేకున్నది. మార్గం తెలియని హృదయ మర్కటం నలువైపుల పిచ్చిదానివలె పరిభ్రమిస్తున్నది.

హృదయమనే కపిని బంధించడానికి భక్తిపాశమే ఏకైక మార్గం. నిర్మల భక్తి మందాకినీ వీచికలకు అలవాటుపడిన తర్వాత మోహ మహారణ్యంలో పరిభ్రమించటం జగగదు. హృదయ పద్మంలో పవ్వళింపజేసి, పారవశ్యంలో ముంచే భక్తి, కామాతురతను నిరోధిస్తుంది. శివనామామృత పానంచే మత్తెక్కి మహదానందంలో మైమరచి ఉన్న మానసం ఆశాశాఖలపై దూకడానికి శక్తి లేనిది అవుతుంది. చిందులేసే చిత్తం శివ పాదారవిందస్మరణచే నిర్మలానందం అనుభవిస్తుంది.

చిత్తమెప్పుడూ శివుని మీదే ఉండాలి. మనస్సులో మహేశ్వర ధ్యానమే కొనసాగుతూ ఉండాలి.

**"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి"**

"సమస్త భూతాల హృదయాలలో ఈశ్వరుడు నిలిచి ఉన్నాడు" అని భగవద్గీతలో పరమాత్మ తెలిపాడు.

**ఏతత్ జ్ఞేయం నిత్యమేవ ఆత్మసంస్థమ్**
**నాతః పరం వేదితవ్యం హి కించిత్**

"సదా తనలో ఉన్న పరమాత్మను తాను తెలుసుకోవాలి. తెలియదగిన వస్తువు దీనికంటెను మరొకటి లేదు" అని శ్వేతాశ్వతరోపనిషత్తు ప్రవచించింది.

"హే పరమశివా! అట్టి ధ్యేయమూర్తివైన నిన్ను ఎన్నడూ నేను స్మరించలేదు. అభిమాన అహంకారాలతో కరడుగట్టిన నా చిత్తం అతి కఠినమైనది. భక్తిబీజాలు మొలకెత్తడానికి నా హృదయక్షేత్రం అనుకూలంగా లేదు.



"సాంబశివా! పుణ్యాత్ములకు ఎక్కడైనా చోటు లభిస్తుంది. నాలాంటి పాపాత్ములను నీవు తప్ప మరెవ్వరూ కాపాడలేరు. తండ్రీ! పరమశివా! నేను అవివేకిని. అజ్ఞానివి. నన్ను త్యజించకు. నా మదమణచి, మతి సరిజేసి నన్ను ఉద్ధరించు. అసత్యజీవనానికి అలవాటుపడిన నా అంతఃకరణ జన్మాంతరాలలో పయనించి బంధాలను ఏర్పరచుకొన్నది. బరువులను తెచ్చుకొన్నది. విచిత్రమైన బరువులను తలపై పెట్టుకుని అగాధ సంసారార్ణవంలో పయనిస్తున్నది. తీరమెక్కడో, విరామమెక్కడోఅవగతంగాక అలమటిస్తున్నది.పరమేశా! విధివ్రాతను అంతమొందించు. ధ్యానంలో నా మనస్సు లగ్నం కానీ.

"తండ్రీ! దిక్కులేని నాలాంటి వారికి నీవే దిక్కు. భక్తుల పాలిట పెన్నిధివి. నా అపరాధాలను మన్నించు. బిడ్డలు తప్పులు చేయడానికి అలవాటుపడ్డారు. తండ్రి దయాసాగరుడు. బిడ్డల అపరాధాలను మన్నించు. హే పరమశివా! నాకు తల్లివి, తండ్రివి సర్వమూ నీవే! నా దోషాలను ఎంచక నన్ను క్షమించు. క్షమించి ఉద్ధరించు. ఉద్ధరించి తరింపచేయి.



**చంద్రోద్భాసిత శేఖరే స్మరహరే,**
**గంగాధరే శంకరే**
**సర్పైర్భూషిత కంఠకర్ణ వివరే**
**నేత్రోత్థ వైశ్వానరే**
**దంతి త్వక్కృత సుందరాంబర ధరే**
**త్రైలోక్య సారే హరే**
**మోక్షార్థం కురు చిత్తవృత్తి మమలా**
**మన్యైస్తు కిం కర్మభిః** 10

చంద్రశేఖరుడు, గంగాధరుడు, శంకరుడు, కంఠం చుట్టూ, కర్ణములపై సర్పాలను ధరించినవాడు, అగ్నిశిఖ నేత్రంగా కలవాడు, సుందరమైన గజచర్మాన్ని వస్త్రంగా ధరించినవాడు, త్రైలోక్య సారభూతుడు అయిన హరుని యందే మనస్సు ఉంచు. నీకు మోక్షం సిద్ధిస్తుంది. అన్యమైన కర్మలు నిష్ప్రయోజనాలు.

పడిన బాధలు చాలు. ఇకనైనా శివుని ధ్యానించి తరించడానికి యత్నించడం మంచిది. శిరస్సుపై శశిరేఖను ధరించి శివుడు చంద్రశేఖరుడయ్యాడు. చంద్రుడు చల్లని కిరణాలను కలిగి ఉన్నాడు. తాపాన్ని చల్లార్చుతున్నాడు. అట్టి చంద్రుని శిరస్సున ధరించిన పరమశివుడు ప్రశాంతమూర్తియై, తనను ఆశ్రయించే భక్తజనుల హృదయాలలోని వాసనాతాపాన్ని నిర్మూలిస్తున్నాడు.

చంద్రశేఖరుడైన మహేశ్వరుడు గంగాధరుడు. శిరస్సున గంగను ధరించాడు. బుద్ధిలో జ్ఞానగంగను ధరించినవాడు. అజ్ఞానాన్ని అంతమొందిస్తాడు.

జ్ఞానంతో శోభిస్తూ ప్రశాంతమనస్కుడైన మహేశ్వరుడు కంఠాన, కర్ణములపై పాములను ధరించాడు. కంఠాన్ని పాముచుట్టి ఉన్నా ఆ దివ్యాత్ముని ప్రశాంతతకు భంగం కలుగలేదు. శాంతమూర్తిగా గోచరిస్తున్నాడు. ఆప్తకాముని ఆపదలు ఏం చేయగలవు? ఆత్మవిదుని దివ్యశోభకు ఇవి నిదర్శనాలు.

పరమశివుని నేత్రంలో అగ్ని ఉద్యుక్తమై ఉంది. అది మామూలు అగ్ని కాదు. జ్ఞానాగ్ని. అజ్ఞానమనే చీకట్లను అంతమొందించే జ్ఞానాగ్ని. ముల్లోకాలలో అభిలషించదగింది జ్ఞానమొక్కటే. అందుచేత జ్ఞానమయుడైన పరమేశ్వరుడు ముల్లోకాలకు సారభూతుడు.

"మనసా! అడ్డదారులలో పయనించకు. బ్రతుకు నావకు తెడ్డువేసి నడిపే పరమశివుని పాదపద్మాలను ఆశ్రయించి తరించు. అంతకుమించి విశిష్టసాధనలు ఏవీ లేవు".

తోటలో ఏ మొక్కను నాటుతామో దానికి సంబంధించిన ఫలాలనే పొందుతుంటాము. హృదయ వనవాటికలో ఏ భావం స్పందిస్తే అదే అనుభూతిగా మిగుల్తుంది. బ్రహ్మజ్ఞాన ఫలం ఇచ్చే ఉత్కృష్టమైన పంటను పండించుకోవాలి. అరిషడ్వర్గాలనెడి కలుపుమొక్కలను తొలగించుకోవాలి. అవగాహన అనే జలం పోసి, వివేకమనే ఎరువువేసి, అభిమానమనే పక్షులు, అహంకారమనే మృగాలు పాడుచేయకుండా చూసుకోవాలి. బీజం నాటిన నాటి నుంచి అది పుష్పించి ఫలించే వరకు తోటమాలి ఏ విధమైన శ్రద్ధ కలిగి ఉంటాడో, ఆధ్యాత్మిక బీజం హృదయోద్యానవనంలో పడిన నాటి నుండి అమృతానంద ఫలం అందుకునే వరకు సాధకుడు జాగరూకుడై ఉండాలి. కనుక అన్యమైన కర్మలను మరచి శివధ్యాన తత్పరులై తరించాలి.

దరిద్రుడు, ధార్మికుడైన ప్రభువును ఆశ్రయించి దారిద్ర్యాన్ని బాపుకొంటాడు. పుణ్యమనే సిరిలేక అవస్థల పాలయ్యే జీవుడు పరమేశ్వరుని ఆశ్రయించి జన్మదారిద్ర్యం పోగొట్టుకోవాలి.



**రోధస్తోయ హృతశ్రమేణ పథికశ్ఛాయాం తరోర్వృష్టితో**
**భీతస్స్వస్థ గృహం గృహస్థ మతిథిర్దీనః ప్రభుం ధార్మికమ్**
**దీపం సంతమసా కులశ్చ శిఖినం శీతావృతస్త్వం తథా**
**చేత స్సర్వభయాపహం వ్రజసుఖం శంభోః పదాం భోరుహమ్**

"మనసా! అలసిపోయిన బాటసారి చెట్టునీడను ఆశ్రయించినట్లు, జల ప్రవాహంలో కొట్టుకొని పోయేవాడు గట్టును పట్టుకొని నిలబడినట్లు, వర్షం వలన భీతి చెందినవాడు ఇంటిని చేరినట్లు, పొరుగూరు నుంచి వచ్చి ఆకలితో అలమటించే అతిథి గృహస్థుని ఆశ్రయించినట్లు, దరిద్రుడు ధర్మాత్ముడైన రాజును ఆశ్రయించునట్లు, అంధకారంలో అలమటించేవాడు దీపాన్ని ఆశ్రయించినట్లు, చలికి వణికేవాడు అగ్నిని సమీపించినట్లు సర్వభయాలను పోగొట్టి సమస్త శుభాలను చేకూర్చే శంభుని పాదపద్మాలను ఆశ్రయించాలి అని శ్రీ ఆదిశంకరులు మల్లికార్జునుని ధ్యానించి తరించమని మనస్సును ఉద్దేశించి ప్రవచించారు.

ఛిద్రమైన సంసారాన్ని తొలగించుకొని హృదయంలో రుద్రదేవుని భద్రంగా నిలుపుకోవాలి. శివుని ధరించే హృదయం శివమయమై శోభిల్లుతుంది. జ్యోతిర్మయమై వెల్గొందుతుంది. భగవంతుని కొరకు భక్తుని హృదయం తీవ్రంగా పరితపించినపుడే భగవదనుగ్రహం లభిస్తుంది. మేఘాన్ని దర్శించి జలం కొరకు నిరీక్షించే చాతకం వలె హృదయగగనంలో పరమేశ్వరుని రూపం దర్శించి, ఆ దివ్యాత్ముని అనుగ్రహ వర్షానికి భక్తుడు సదా నిరీక్షిస్తూ ఉండాలి.



**కింవానేన ధనేన వాజి కరిభిః**
**ప్రాప్తేన రాజ్యేన కిం**
**కింవా పుత్ర కలత్ర మిత్ర పశుభి**
**ర్దేహేన గేహేన కిం**
**జ్ఞాత్వైతత్ క్షణభంగురం సపదిరే**
**త్యాజ్యం మనోదూరతః**
**స్వాత్మార్థం గురువాక్యతో భజ**
**భజ శ్రీ పార్వతీ వల్లభం** 11

***శంభో! కళ్ళముందే నిత్యం ఆయువు క్షీణిస్తున్నది. యౌవనం నానాటికీ గతిస్తున్నది. పోయినరోజులు తిరిగి రావు. కాలం లోకాన్నే మ్రింగుతున్నది. జల తరంగం వలె సంపద చపలమైంది. జీవితం మెరపుతీగవలె చంచలమైంది కనుక శివా! శంభో! నీవే నాకు శరణ్యం. నిన్నే ఆశ్రయించిన నన్ను దయతో రక్షించు.***

రాత్రి గడిచింది. ఉదయం తెలిసింది. సూర్యుని కిరణజాలం దేహాన్ని ఉడికిస్తున్నది. బడబాగ్ని వలె ఒకనాడు చితిలో రగిలే శరీరానికి కలిగే స్థితికి మచ్చు తునక అన్నట్లు ఎండ దేహాన్ని శోషింపజేస్తున్నది. ప్రతి రోజు చీకటిలో లయించి నట్టు మానవజీవితం శ్మశానంలో అంతరిస్తుందని కదిలే కాలం సందేశం అందిస్తున్నది. యౌవనం మూడునాళ్ళు. ముచ్చట తీరేలోగా మూలజేరే మాయావి యౌవనం.

వెళ్ళిన రోజులు మళ్ళీ రావు. మరలిపోయిన మనుగడ తిరిగిరాదు. ప్రవాహం నీటిని సముద్రానికి చేర్చినట్లు కాలం బ్రతుకును వల్లకాటికి చేర్చుతున్నది. కాల రూప సుడిగుండంలో ప్రపంచమే తరుమారవుతున్నది. తల్లడిల్లుతున్నది. తరిగిపోతున్నది. అంతరించిపోతున్నది. నీటిలోని తరంగం కదిలేది ఎంతసేపు? కనుమరుగయ్యే దెంతసేపు?

చేతిలోని లచ్చి అచ్చిరాదు. మచ్చిక తెలియని లచ్చి పిచ్చిలో చచ్చేదాకా చరిస్తూనే ఉండాలా? అది గచ్చపొదయని తెలియదా?

అదిగో పచ్చని పొలం .... ఇదిగో చచ్చిన శవం

కాలరూపమే సుడిగుండం ... తప్పించుకో ఈ గండం

మరణం చేరేలోగా శరణంటూ శివుని చేరి తరించాలి. శవమయ్యే స్థితి రాకుండా శివమై వెలిగిపోవాలి.

భగవానుడు భక్తసులభుడు. భక్తవత్సలుడు. భక్తి తల్లివంటిది. భక్తుడు బిడ్డలాంటివాడు. తల్లి ఒడిలో సమస్త దుఃఖాలను మరచి బిడ్డ నిద్రించునట్లు భక్తిలో భక్తుడు తన్మయుడై తరిస్తాడు. తల్లి బిడ్డ బాధలను తీర్చుతుంది. భయాలను తొలగిస్తుంది. సుఖాలను కలిగిస్తుంది. శాంతిని అందిస్తుంది. అలాగే భక్తి జన్మలోని బాధలను రూపుమాపుతుంది. సంసారభయాన్ని అంతమొందిస్తుంది. ఆత్మసుఖం ప్రసాదిస్తుంది. అమృతఫలం అందిస్తుంది.

భక్తి పరమపవిత్రమైంది. భక్తి సమస్త వాసనలను క్షయం చేస్తుంది. ప్రేమను వృద్ధి పొందిస్తుంది. అగ్ని వస్తువులను దగ్ధమొనర్చినట్లు, భక్తి సర్వపాపాలను పోగొట్టి



దివ్యైశ్వర్యం ఇచ్చి రక్షిస్తుంది. భక్తిలో శరణాగతే కేంద్రవిషయం. శరణాగతి, దైవ కరుణ ఈ రెండును పరస్పరాధీనాలు. అన్యోన్యాశ్రయాలు. శరణాగతి హృదయ శుద్ధిని ఆరంభిస్తుంది. దైవకరుణ దానిని పూర్తి చేసి సిద్ధిని ప్రసాదిస్తుంది. కనుకనే ఈ శివాపరాధ క్షమాపణ స్తోత్ర సమాప్తి సమయాన శరణు పలుకుతూ కరుణను యాచించడం జరుగుతున్నది.

ఈ ప్రపంచం ఒక ఇంద్రజాలం. మహేంద్రజాలం. దీనిని సత్యమని భావించకూడదు. ఇంద్రజాలాన్ని వినోదంగా దర్శించినట్లు ఈ ప్రపంచాన్ని దర్శించాలి. సత్యమని భావిస్తే అనంత దుఃఖాలు తప్పవు. సదా సత్యరూపుడైన పరమాత్మనే చింతిస్తూ ఉండాలి.

**అసత్య స్సర్వ సంసారో రసాభాసాది దూషితః**
**ఉపేక్ష్యో బ్రహ్మ విజ్ఞేయం ఇతి వేదాన్తడిణ్డిమః**

"సమస్తమైన సంసారం అసత్యం. రసాభాసాది దోషాలతో కూడినది. దీనిని ఉపేక్షించి బ్రహ్మమునే తెలుసుకో" అని వేదాంతడిండిమంలో శ్రీ శంకరాచార్యులు బోధించారు.

నిచ్చెన ఎక్కేటప్పుడు ఎగ్రబాకాలే గాని క్రిందకి జారకూడదు.

వానరుడు నరుడైనాడు. నరుడు నాగాభరణుడు కావాలి. ఇదే ప్రగతి మార్గం. పవిత్ర మార్గం.

"హే దయామయా! అన్యాయాలకు, అపరాధాలకు అలవాటుపడిన వాణ్ణి. క్షమాపణలే నా ప్రార్థనలు. నీవు తప్ప నాకు మరో శరణ్యం శూన్యం. నిన్ను గాక మరొకరిని ఆశ్రయించలేను. స్మరించగనే దీనులను, అదృష్టహీనులను నీవు కరుణించావు. ఓ పరమశివా! నా మొర ఆలకించు. నన్ను కరుణించు. ఇలలోనైనా, కలలోనైనా నీవు నాకు దూరం కావద్దు. భారం కావద్దు."

ఓం తత్ సత్